విడిప్రతిక ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

నం॥ చందా రూ. ౬ | సెప్టెంబరు ౨౧ వ తేది ౧౯౩౬ సోమవారము | అర్ధ సం॥ చందా రూ ౩

సంపుటము ౧౧ | త్రూపుబజారు, హైద్రాబాదు - దక్కన్. | సంచిక ౩౯

శా. శ. ౧౮౫౮ = శ్రీధాత సం॥ నిజభాద్రపద శు॥ ౬ సోమవారము. = ౨౧ ఆబాన్ ౧౩౪౫ ఫ.

## శ్రుతి స్మృతులలోని స్త్రీల పరిస్థితి

జటావల్లభుల పురుషోత్తంగారు, ఎం. ఏ.

(వేదములను స్మృతులను పరిశోధించి నేనిదివరలో రచించియుండిన "వేదకాలపు స్త్రీలు" "స్మృతికాలపు స్త్రీలు" అను రెండు భిన్న గ్రంథములలోని సారాంశములను సంపుటీకరణము చేసి యోతద్వ్యాస పరంపరారూపమున నాంధ్రుల కర్పించుచున్నాను.)

| వ్యాసకర్త:

### ౧ కూతురు

కుమారులు జన్మింపవలెనను కోరికలును, ప్రార్థనలును వేదములలో లెక్కలేనన్ని స్థలములలో గాన్పించుచున్నవి. కుమార్తెలు గలుగవలెనను కోరిక యొకటి రెండు స్థలములలో మాత్రమే కన్పట్టుచున్నది.

"... సమస్యాం యశసం సువీరం
... వర్గం రయిమశ్వ యుజ్యం"

(ఋక్సంహిత ౧-౯౨-౧-౫)

(... యుషోదేవతా, కీర్తితోఁ గూడినట్టియు ... లగు పుత్రులు గల్గినట్టియు, దాసజనసర్గము గల్గినట్టియు ఐశ్వర్యమును నేను బొందుదును గాక!)

"మానో అగ్నే మతయే మావీరతా ... రథః."

(ఋ. సం. ౩వ మండలమున ౧౬వ సూక్తము ౫వ ఋక్కు)

(ఓయగ్నీ, మమ్మల నపుత్రతకు విషయభూతులనుగఁ జేయకుము).

ఇట్టి యసంఖ్యాక స్థలములలోఁ బుత్రప్రాప్తియే యర్థింపబడినదికాని దుహితృప్రాప్తి యర్థింపఁబడలేదు.

కుమార్తె వాంఛింపఁబడిన యొకటిరెండు స్థలములలోనైనను పుత్రవాంఛ వదలఁబడలేదు సరికదా, పుత్రప్రాప్తికిఁ బ్రాధాన్యమును దుహితృప్రాప్తికప్రాధాన్యమును గన్పట్టుచున్నవి.

"పుత్రిణేమా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతం"

(తైత్తిరీయ మంత్ర ప్రశ్న ౧-౧౩-౪)

(పుత్రులుగల మీరు కుమార్తెలు గలవారై పూర్ణాయుర్దాయమును బొందుడు)

ఆడుపిల్లలుగల్గుట పాపఫలమనికూడ సూచింపబడి యున్నది.

"తస్మాత్ స్త్రియం జాతాం పరాస్యంతి ... పుమాంసం హరంతి" (?)

"... వియుయాత్ర్యస్య జాయేతోస్య ... మహీపుగ్ సః పుమాసే ... వాస్య జాయతే"

[తై. సం. ౨-౬-౧-౪,౫]

[యజ్ఞములో దర్భలయగ్రములుగిలిపి దండముపలె నుండవలెను. అట్లగుచో యజమానునకుఁ బుత్రుడుగల్గును. దర్భల కొనలను విప్పియుంచినచో, అట్లు చేయునో గుమార్తె ... పుట్టుటకు కారణమని చెప్పబడినది. చేయవలసిన విధిని నెఱవేర్చుటకు ఫలముగ బుత్రజననము చెప్పఁబడినది.

వేదములలో స్త్రీపురుష సంతతులపట్ల నిట్టి భేదము పాటింపఁబడుటకుఁ గారణములు రెండు: ౧. స్త్రీసంతతివలనఁ గంటె పురుషసంతతివలన వంశమునకెక్కుడు లాభముండుట, ౨. పురుషుని జీవితముకంటె స్త్రీ జీవితమెక్కుడు దుఃఖభాజనముగ నుండుట. ఇందు మొదటిదానిని మూడువిధములుగ విభజింపవచ్చును. ౧ ఆ దినములలో నీయుద్ధము లెక్కుడుగనుండెను. యుద్ధము చేయు స్త్రీలు వేదకాలములోఁ గొందఱున్నను యుద్ధము సాధారణముగఁ బురుషోచితకర్మమే యని వంశమును ముందధ్యాయములోఁ జూచెదము. ౨. నాడు మరణానంతరమునఁ జేయఁబడు కర్మకు విశేష ప్రాధాన్యముండెను. కర్మనుజేయువాడు సాధారణముగ పురుషుఁడేకాని స్త్రీకాదనుట శ్రమ నీయధ్యాయములోనే ముందు చూచెదము ౩. నేత్రపర్వముగ గృహములోఁ గన్పట్టుచుఁ గాలక్షేపము చేయువాఁడు కుమారుఁడే కాని కుమార్తె కాదు. కుమార్తె యత్తవారింటికేగుటను గూర్చి వివాహమును సధ్యాయమునఁ బ్రసంగింపఁబడును.

స్త్రీసంతతి పురుషసంతతికంటె నెక్కుడు దుఃఖభాజనముగ నుండెడిదని చెప్పుట కీక్రింది హేతువులను దెలుపవచ్చును. ౧. స్త్రీయొక్క సౌభాగ్యము తనయుర్తతిపైననేగాక భర్తయొక్క సౌజన్యముపైనను ప్రయోజకత్వముపైనను గూడ నాధారపడియుండెడిది. ఆమె యెంత యోగ్యురాలైనను నాతను సరియైనవాడు కానిచో నామె జీవితము దుఃఖభాజనమే. భర్తజూదరియై ధనమంతయును బాడుచేసికొనినచో నామె దారిద్ర్యము ననుభవించుటయేకాక యితరములగు కొన్ని కష్టములనుగూడ ననుభవింపవలసియుండెను. ఈవిషయమై యీక్రింది ఋక్కు పరికింపదగును.

అన్యే జాయాం పరిమృశన్త్యస్య యస్యా
గృధద్వేదనే వాజ్యక్షః

[ఋ.సం. ౧౦-౩౪-౪]

ఏజూదరియొక్క ధనమును బలవంతుఁడగు ద్యూతదేవత హరింప యత్నించునో, యాతని సుభార్య నితర ద్యూతకారులు పట్టుకొని లాగుచున్నారు.

భర్త జూదములో ధనమును బోగొట్టుకొనినచో నాతనిభార్య నితరద్యూతకారులు హింసించుచుండుటకంటెను స్త్రీల భర్త్రధీనతను దెల్పుటకిఁ కేమికావలెను?

౨. వైధవ్యమొందుటయు భర్తచే విడువఁబడుటయును మరవస్థలు స్త్రీకిఁ బ్రాప్తించుచుండెడివి. పురుషునకన్ననో పునర్వివాహముండెను. ఈయంశము రాబోవునధ్యాయములలో వివరింపబడును.

పురుషునకు బహుభార్యలుండుట వేదములలో నరుదుగఁ గన్పట్టు విషయముకాదు. దీనివలన స్త్రీలకుఁ గల్గు కష్టములను వేరుగ వివరింపనక్కరలేదు. సవతులవలని బాధ స్థలాంతరమున వర్ణింపఁబడును.

ఈహేతువులచే పురుషునికంటె స్త్రీ యెక్కుడు దుఃఖభాజనమని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. ఐతరేయ బ్రాహ్మణము స్పష్టముగ నిట్లు చెప్పుచున్నది,

"కృపణం హ దుహితా" [ఐ. బ్రా. ౭-౧-౧౧]

[కుమార్తె జాలినిగల్గించును]

కుమారులు లేనపుడు మాత్రము కుమార్తె తత్స్థానము స్వీకరించుచున్నది. దత్తపుత్రుడు వేదములోఁ బూర్ణముగ నామోదింపఁబడలేదు.

"నహి గ్రభాయారణః సుశేవోన్యోదర్యో మనసా మన్తవా ఉ అధాచిదోకః పునరిత్స ఏత్యానో వాజ్య భీషాళేతు నవ్యః"

[ఋ. సం. ౭-౪-౮]

[సంతోషపెట్టెడు వరోత్పాదకుఁడు అపరానితకులమున జన్మించినవాడు సుఖము నొసఁగఁజేయువాడై గ్రహించుటకొఱకు మనస్సుచేతనైనను దలచుటకుఁ దగినవాఁడు కాడు. మఱియు వాఁడు తన జన్మస్థానమునకే తిరిగిపోవును.

## గ్రంథాలయముల ఏర్పాటు

ఆంధ్రమహాసభా స్థాయిసంఘము (హైదరాబాదు)వారి విజ్ఞప్తి

నిజాం రాష్ట్రాంధ్రజిల్లాలలోని పలుతావుల వాస్తవ్యులు గ్రంథాలయములగురించియు, పఠనాలయములగురించియు, తరుచుగా వారికికలిగిన సందేహములనుగురించి మాకార్యాలయమునకు లేఖలు వ్రాయుచున్నారు. వారికి కలిగిన సందేహములు ఏమనగా:

౧. గ్రంథాలయములు స్థాపించుటకు మహాఘనతవహించిన సర్కారువారి అనుమతి అవసరమా?

౨. అనుమతి అవసరమున్నచో ఏఅధికారివద్దనుండి అనుమతిపొందవలయును. దానిచర్యయేమి?

ఈసందేహముల లేఖలు పంపిన మహాశయులకు అప్పటికప్పుడే ప్రత్యుత్తరముల నొసంగితిమి. అయినప్పటికిన్ని ఈలాంటిసందేహములు ఇంకొందరికి కలిగి, వాటిని తమంతవారే నివృత్తపరచుకొని, సదుద్దేశ్యములు నేర్పరచుటకు అనుమతి పొందవలెనేమోయనుకొనుచుండుటచేత ఈ కార్యములు చేయుట అసంభవమని భావించి నిరాశజెందుదురేమో యనుసంశయము మాకు కలిగినది. మన తెలంగాణాలోని వాస్తవ్యులందరికిని ప్రజాహితకార్యములలో ప్రేమయుండి గ్రంథాలయాలు, పఠనాలయములు, స్థాపించనుద్యుక్తులైనవారికందరికిని సందేహనివారణ అవసరమని తలచి ఈవిజ్ఞప్తి ప్రకటించవలసి వచ్చినది.

గ్రంథాలయాలుకాని, పఠనాలయాలుకాని స్థాపించుటకు ఏవిధమైన నిబంధనలు, ఇబ్బందులులేవు సర్కారువారి అనుమతి అక్కరలేకుండ పైసంస్థలు స్థాపించుకోవచ్చును. శ్రీ మహాఘనతవహించిన ప్రభువరేణ్యుని పాలనాధికారవర్గమువారి యుద్దేశ్యము తమ సంస్థానములోని ప్రజలలో తగినంత విద్యా విజ్ఞానము వ్యాపించి మూర్ఖత్వము నిర్మూలము కావలెననియే వారి ఈ సదుద్దేశ్యములకు ప్రజలుకూడ సాధ్యమైనంతవరకు తోడ్పడవలసిన విధి ప్రజలపైనున్నదిగదా? ఈకర్తవ్యమును దేశీయులు గ్రహించి గ్రంథాలయములద్వారాకాని, పఠనాలయముల ద్వారాగాని నెరవేర్పవలెను. ప్రయత్నించుట యేలాటిదోషముకాజాలదు. దేశీయులు ఈకార్యాలు చేయుటలో సర్కారువారిసదుద్దేశ్యములకు తోడ్పడిన వారవుటచేత, సర్కారువారు సంతసించెదరు.

కావున గ్రంథాలయాభిమానులు ఈసంగతులు గ్రహించి, తాము చేయదలచిన కార్యములకు ఏలాటి నిబంధనలు యిబ్బందులులేవని నమ్మి తమయుద్దేశ్యములను సాగించవచ్చునని మనవి చేయుచున్నాము.

ఇట్లు

కార్యదర్శులు { మం. రామచంద్రరావు / సు. ప్రతాపరెడ్డి

## బాలికల ఉన్నత పాఠశాల

సుల్తానుబజారు

మాతృభారతీ జయంత్యుత్సవము

ఈపాఠశాలయొక్క మాతృభారతీ జయంత్యుత్సవము ౨౮ సెప్టెంబరు ౧౯౩౬ [౧౯ ౫ కార్తిక ౧౩౪౬ ఫ సుహావారము] నాడును ఓహం మానప్రదానోత్సవము ౨౯ సెప్టెంబరు ౧౯౩౬ [౫ఆబాన్ ౧౩౪౬ ఫ, శుక్రవారము] నాడును, ప్రతిదినము సాయంత్రము ౪ గంటలనుండి, బడిపిల్లలయు పాటలు, నాటకరంగముల ప్రదర్శనమును పాఠశాలానివేదికపఠనము, మున్నగునవి కార్యక్రమముగలవు. స్త్రీలకు ప్రత్యేకస్థలము ఏర్పాటు చేయబడియున్నది.

దోమకొండ సంస్థానాధీశులగు శ్రీ రాజా రాజేశ్వరరావు బహాదరు గారు అధ్యక్షత వహించుటకు దయతో నంగీకరించియున్నారు.

## నిజాం రాష్ట్ర ఐదవ ఆంధ్రమహాసభ

జిల్లా ఆంధ్రజనసంఘములకు ఆహ్వాన సంఘ విజ్ఞప్తి

ఐదవ ఆంధ్రమహాసభసమావేశము ధాతిసంవత్సర మార్గశిరశు. ౨,౩. రలకు సరియగు ౧౨, ౧౩, ౧౪ బహమన్ ౧౩౪౬ ఫ. తేదులలో మహబూబునగరంజిల్లాలో చేరిన షాద్‌నగరములో జరుగునని ఇదివరకు పత్రికాముఖమున తెల్పబడినది.

మహాసభాధ్యక్షుని నియామకమును గూర్చి నియమావళియొక్క ౧౭వనియమానుసారము జిల్లాసంఘములు తమయభిప్రాయమును, ఆహ్వానసంఘమునకు తెలుపవలసియున్నది. కావున రాష్ట్రములోని జిల్లాసంఘములు మహాసభాధ్యక్షుని ఎన్నుకొని తమతీర్మానమును ఆహ్వానసంఘమునకు ౧౫ఆజూరువరకుపంపప్రార్థితులు.

జిల్లాసంఘములు లేనిజిల్లాలలోనిప్రముఖులు తమయభిప్రాయమును తెలిపినచో అధ్యక్షునిఎన్నుకొనుటలో మాకు సౌలభ్యముకలిగించినవారగుదురు.

ఇట్లు

విధేయుడు

బూర్గుల వేంకటేశ్వరరావు

కార్యదర్శి.

స్త్రీవిద్యాభిమానులందరును దయచేసి ఈసంస్థను ప్రోత్సహింప ప్రార్థన.

బూర్గుల రామకృష్ణారావు

బి.ఏ., ఎల్.ఎల్.,బి.

మాడపాటి హనుమంతరావు

కార్యదర్శులు.

